# గురు పౌర్ణమి విశిష్ఠత | వ్యాస పూర్ణిమ

|| గురువందనం ||

శ్లో|| గురవే సర్వ లోకానాం భిషజే భావరోగిణామ్ |
నిధయే సర్వ విద్యానాం దక్షిణామూర్తయే నమ: ||

శ్లో|| చిద్ఘనాయ ప్రకాశాయ శృత్యాకాశ విహారిణే |
అద్వైతామృత వర్షాయ శంకరాయ నమోనమ: ||

శ్లో|| సదా శివ సమారంభాం శంకరాచార్య మాధ్యమామ్ |
అస్మదాచార్య పర్యంతం వందే గురుపరంపరామ్ ||

శ్లో|| ఏకమేవాక్షరమ్ యస్తు గురు: శిష్య: ప్రబోధాయేత్ ||
పృథివ్యామ్ నాస్తి తద్రవ్యమ్ యద్దత్వా చానృణీ భావేత్ ||




**గురు పౌర్ణమి విశిష్ఠత:**

ఆషాఢ మాస శుక్ల పక్ష పౌర్ణమిని '**గురుపౌర్ణమి**' లేదా '**వ్యాసపౌర్ణమి**' అని అంటారు. ఈ సంవత్సరం గురుపౌర్ణః (**గురు పూర్ణిమ**) **2018 జులై 27వ** తేదిన వచ్చినది. అయితే సాధారణంగా అన్ని పండుగలను జరుపుకోవడాని నిబద్ధత, విధానం ఉంటె, గురుపౌర్ణమికి మాత్రం అలా కాకుండా ఒక ప్రత్యేకత ఉంది. గురు సమానులైన వారందరికీ కృతజ్ఞత ను తెలుపుటయే ఈ గురుపౌర్ణమి (**Guru Purnima**) ముఖ్య ఉద్దేశ్యం. అందుచేతనే ఈ రోజును ఒకొక్కరూ ఒక్కొక్క విధంగా తమ గురువులకు కృతజ్ఞతా భావమును తెలిపెదరు. ఇదే రోజున వ్యాసముహాముని జన్మతిథి కావున **వ్యాస పూర్ణిమ** లేదా **వ్యాస జయంతి** మహాపర్వదినంగా గురు భగవానుడిని, **వ్యాస మహర్షి**ని పూజించేవారికి అష్టైశ్వర్యాలు చేకూరుతాయి అనాది కాలం నుంచీ ఒక సాంప్రదాయం నెలకొన్నది.



మనిషి పుట్టుకతో అన్నీ నేర్చుకుని రాడు. కొందరికి స్వతహాగా నేర్చుకునే శక్తి వుంటే, మరి కొందరికి ఎదుటి వారిని చూసి నేర్చుకునే శక్తి వుంటుంది. ఉదయం లేచిన దగ్గర నుండి, రాత్రి నిద్రించే వరకూ ప్రక్క వారి సహాయం అవసరమౌతుంది. అది మాట సహాయం కావచ్చు లేదా పని సహాయం.... ఎందుకంటే మనిషి ఒంటరి జీవితం గడపలేదు. అలానే ఎవరి సహాయం లేకుండా అస్సలు బ్రతకలేడు. పుట్టిన మరుక్షణం నుండి మాతా పితరుల ఆధ్వర్యంలో, యవ్వనంలో జీవిత భాగస్వామి సహచర్యంలో, వృద్ధాప్యంలో తన బిడ్డల అండలో కాలం గడిపేస్తాడు. ఓనమాలు అమ్మ ఒడిలో నేర్చుకుంటే, అ ఆ లు బడిలో నేర్చుకుంటాడు . ఇలా ఎవరో ఒకరి సహకారంతో జీవన

పయనం సాగిస్తాడు . కాని అదే జీవితాన్ని ఎటువంటి మార్గంలో, ఎలా నడిపించాలి అన్న మీమాంస ను ఒక్క గురువు మాత్రమే తీర్చగలడు.

1. గురువులనగా ఎవరు?
2. గురువులను ఎలా నిర్దేశించు కోవాలి?
3. గురువులు ఎన్ని రకములు?
4. గురువుల ఆవశ్యకత ఏమిటి?
5. గురు పూర్ణిమను ఎలా జరుపుకోవాలి?

**1. గురువులనగా ఎవరు?**

అవిద్యా హృదయగ్రంధి బంధమోక్షో భావేద్యతః
తమేవ గురు రిత్యాహు ర్గురుశబ్దార్ధ వేదినః
భావం : ఏ మహానుభావునిచే అవిద్యాహృదయగ్రంధి బంధమోక్షము గలుగునో వారే గురువని గురుశబ్దార్ధం.

శ్లో|| గుశబ్దస్త్వంధకారః స్యాత్ రు శబ్దస్తన్నిరోధకః
అంధకార నిరోధిత్వాద్గురురిత్యభిధీయతే
భావం: గు అను శబ్దమునాకు అర్థం అంధకారము, రు అను శబ్దముకు అర్థం దానిని నాశము చేయు తేజస్సు. అనగా అజ్ఞానాంధకారమైన చీకటిని నాశముజేసి స్వయంప్రకాశమగు పరబ్రహ్మమును కరతలామలకమువలె జేయువారే గురువని గురుశబ్దార్ధము.

శ్లో|| గుకారశ్చాంధకారో హి రుకారస్తేజ ఉచ్యతే
అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః
భావం: గుకార మంధకారం(అజ్ఞానం) రుకారం తేజస్సు(జ్ఞానం). అజ్ఞానమను తమస్సును మ్రింగువారే గురువు. వారే బ్రహ్మం.సంశయం లేదు.

శ్లో|| గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః
గుణరూప విహీనత్వా ద్గురురిత్యభిధీయతే
భావం:గుకారం గుణాతీతం,రూపాతీతం రుకారం.నామరూపగుణ రహిత అవస్థ(స్థితి)యగు బ్రహ్మమును తెలుపువారే గురువు.

ఇప్పుడు అటువంటి గురువు కృప అందరికీ దొరకాలని కోరుకుంటూ ఆ గురువుకు నమస్కారము చేయండి.

శ్లో|| గురుబ్రహ్మ గురువిష్ణు గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః
భావం: గురువే బ్రహ్మ, గురువే విష్ణు, గురువే మహేశ్వరుడు. గురువు సాక్షాత్ పరబ్రహ్మ. అటువంటి గురువుకు నమస్కరిస్తున్నాను.

శ్లో|| అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం ఏన తస్మై శ్రీ గురవే నమః

భావం: అజ్ఞానమనే గ్రుడ్డితనమునకు జ్ఞానమనే కాటుక దిద్ది, ఆత్మను చూపించు గురువుకు నమస్కరిస్తున్నాను.

శ్లో|| అనేక జన్మ సంప్రాప్త కర్మేంధన విదాహినే
జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవే నమః

శ్లో|| వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః'
భావం: సాక్షాత్ విష్ణుస్వరూపుడు, జ్ఞాననిధి, వసిష్ఠ వంశోద్భవుడైన వేదవ్యాసునికి నమస్కారం

శ్లో|| వ్యాసం వసిష్ఠనప్తారం శక్తే పౌత్రమకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్
భావం: వశిష్ట మహర్షికి మునిమనువడు, శక్తికి మనువడు, పరాశర మహర్షికి పుత్రుడు, శుకమహర్షికి తండ్రి, నిర్మలుడు తపోనిదియైన మహర్షికి నమస్కారం.

శ్లో|| అనేక జన్మ సంప్రాప్త కర్మ బంధ విదాహినే
జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవే నమః
భావం: బహు జన్మల నుండి సంప్రాప్తించిన పాప పుణ్యములు జ్ఞానమను అగ్ని చేత దహింపజేయునట్టి గురువునకు నమస్కరిస్తున్నాను .

## 2. గురువులను ఎలా నిర్దేశించు కోవాలి?

త్రికరణము లచే హింస చేయని వాడును, సత్యశౌచాదులు కలవాడు, సమస్త జీవ రాశుల యందు దయ కలవాడు, శాంత చిత్తం కలవాడు, నిగ్రహానుగ్రహ శక్తులు గల వాడు, వేద సంపన్నుడు, పరమభక్తుడు, యోగమును ఎరిగిన వాడు, యోగ నిష్ఠ యందున్నవాడు,సదా యోగాత్మ స్వరూపుడై బహిరంతర శుద్ధి కలవాడు, జ్ఞానము, యోగము,చర్య, క్రియ, అను నాలుగు పాదాంతముల పర్యంతము శాస్త్ర (కర్మ,యోగ,భక్తీ, జ్ఞాన) మెరింగినవాడు, దంభాచారము లేనివా
శిష్యుల గుణ దోశములలో విశిష్ట జ్ఞానం కలవాడును, సర్వ సంశయములను చేదించిన నిస్సంశయుడైన గురు ఎన్నుకొని అట్టి గురువు యొక్క కటాక్షమును పొందవలెను.

## 3. గురువులు ఎన్ని రకములు?

ఆధ్యాత్మిక గురువులు, వారి వారి లక్షణాలను హిందూ సంప్రదాయం ఇలా నిర్వచించింది .

సూచక గురువులు : ప్రకృతిలో లౌకిక పద్ధతులను తెలిపి వాటి ఫలితాన్ని కూడా తెలియజేస్తారు . భక్తీ జ్ఞాన వైరాగ్య భోదలు చేసి సాధన చతుష్టయ సంపత్తి కలిగిని భక్తులను తయారు చేస్తారు వీరు...

వేద గురువులు: వేద పురాణేతిహాసాలు చదివి, చదివించి, ధర్మ మర్మాలను విశదీకరించి ఆచరింపజేస్తారు వీరు. .

నిషిద్ధ గురువులు : సర్వ యంత్ర-తంత్రములు ఉపాసనలు చేయించి వాటి ధర్మాలను భోదిస్తారు వీరు.

కామ్యక గురువులు : ధర్మ దాతలుగా సప్త సాధనాలు భోధిస్తారు. త్యాగమూర్తులుగా, భక్తులుగా తన భక్తులను తయారు చేస్తారు.

భోధక గురువులు: వేదాంత గ్రంధ పరిచయం కలిగిస్తారు . భోధక గురువులలో మళ్ళీ ఆరు రకాలైన గురువులు వున్నారని చెప్తున్నారు. వారు...

నాద గురువులు : వీరి స్వరం ఎప్పుడైతే శిష్యునికి చేరుతుందో అప్పుడే ఆతడు జ్ఞాన వంతుడుగా మారతాడు .

చాయానిది గురువులు : చాయానిది అనే ఒక పక్షి వుందట . దాని నీడ ఎవరిపై పడుతుందో వారు చక్రవర్తులు అవుతారట. ఈ గురువు అనుగ్రహం ఎవరిపై ప్రసరిస్తుందో వారు ఆధ్యాత్మిక చింతన పరులు అవుతారు .

పరమ గురువులు : వీరు పరుసవేదిలా శిష్యుని తన దివ్య స్పర్శతో భక్తిజ్ఞానాల్ని ప్రసాదిస్తారు

చందన గురువులు: చందన వృక్షంలా జ్ఞాన సుగుణాలను పంచుతారు వీరు.

క్రౌంచక గురువులు: :దూరంగా వుండి కూడా తన గ్రుడ్లను పొదగా గలిగే శక్తి క్రౌంచక పక్షికి వుంటుందట . అదే విధంగా క్రౌంచక గురువు దూరాన వున్నా తన శిష్యులను ప్రయోజకులను చెయగలడు.

వాచక గురువులు : సాంఖ్య ఉపదేశాలు భోధించి, పరమాత్మ సత్యమని, దేహం అశాశ్వత మని తెలిపి గమ్యం గుర్తు చేస్తారు.

కారణ గురువులు : ఆసనాలు, ప్రాణాయామాలు చేయించి చివరకు జీవ బ్రహ్మైక్య సంధానం భోదించి అద్వైత స్థితి ని కలిగిస్తారు.

సద్గురువులు : తెలుసుకోగల్గితే గురువు-శిష్యుడు ఒక్కటే అని తెలియజేస్తారు.

నిజ గురువులు: పరి పూర్ణమును చూపించి జన్మ రహితునిగా చేస్తారు.

### 4. గురువుల ఆవశ్యకత ఏమిటి?

పురాణ పండ రంగనాథ్ గారు వ్యాసుని విశిష్టత వివరిస్తూ వ్రాసిన వ్యాసం ఇది..... “గురు స్థానం పరమ పవిత్రమైనది. అజ్ఞానపు చీకటి నుండి జ్ఞానమనే వెలుగును నాలుగు వైపులకు నడిపించే శక్తి ఒకా గురువుకే వుంది. .. అటువంటి గురువును పూజించడం మన సంప్రదాయం . ప్రతి సంవత్సరం హిందువులు ఆపాడ పౌర్ణమి నాడు **వేద వ్యాసుని జయంతి**ని గురు పౌర్ణమి పేరుతొ జరుపుకుంటారు ” ...బ్రహ్మ మానస పుత్రుడు వశిష్ట మహా ముని, ఆతని కుమారుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుడు. పరాశరునికి, మత్స్యగంధి సత్యవతి ద్వారా విశ్వ తేజస్సుతో జన్మించిన వాడే వ్యాసుడు. తండ్రి వద్ద విద్యాభ్యాసం చేసి ఏక రాశిగా వున్న **వేదాన్ని ఋుక్, యజు, సామ, అధర్వణ అనే నాలుగు భాగాలుగా సులభ గ్రాహ్యం చేసినందుకు ఆతడు వేద వ్యాసుడు అయ్యాడు**.




నావ యందు (ద్వైపాయనం ) జన్మించాడు కాబట్టి మరియు నలుపు రంగులో వున్నాడు కాబట్టి కృష్ణ ద్వైపాయనుడు అని పేరుగాంచాడు. పద్దెనిమిది పురాణాలను, పద్దెనిమిది ఉప పురాణాలను, విజ్ఞాన సర్వస్వం ఐన మహాభారత బ్రహ్మ సూత్రాలను, ఆధ్యాత్మ రామాయణమును రచించి, కలియుగ మానవాళికి కర్మ, భక్తి, జ్ఞాన, మార్గాలను ఉపదేశించాడు ..

ప్రాపంచిక, ఆధ్యాత్మిక జీవన విధానాలను సమన్వయము చేసుకోవడంలోనే మానవ జీవిత వికాసం ఉందని వ్యాస మహర్షి భోదించాడు .

### 5. ఈ గురుపూర్ణిమను ఎలా జరుపుకోవాలి?

(How to perform Guru Purnima)

తాను జీవితమంతా గురు సేవ చేసిన సంప్రదాయాన్ని తన శిష్యులు కూడా పాటించాలని షిర్డీ లో బాబా తన భక్తులకు ఆదేశించాడు. గురువును పూజించడానికి వ్యాసుని జయంతి అయిన వ్యాస పౌర్ణమి (వ్యాస  జయంతి) ని మించిన రోజు లేదని భావించి, ఆ రోజును గురు పౌర్ణమిగా నిర్ణయించి పూజకు ఏర్పాట్లు చేసుకున్నారు. ధుని దగ్గర వుండే స్తంభాన్ని గురువుగా భావించి పూజిస్తానంటే తనకు ఎట్టి అభ్యంతరం లేదని, తనను పరమాత్మగా భావించవద్దని బాబా ఆదేశం. బాబా ఆదేశం ప్రకారం మొదటి సారిగా గురుపూజ చేసిన వ్యక్తి చంద్రాబాయి **బోర్కర్**.



# శ్రీ కామాక్షిమాతర్నమస్తే

జంతోస్తవపదపూజనసంతోషతరంగితస్య కామాక్షి!
బంధోయదిభవతిపునస్సింధోరమ్భస్సుబంభ్రమీతి శిలా!!

- శంకర కింకర

▼

## వ్యాస పర్వం, వ్యాస పౌర్ణమి - గురుపౌర్ణమి పూజ విధానం

**వ్యాస పూజ :-**
ఓం దేవీం వాచమజన యన్తదేవాస్తాం విశ్వరూపాః పశవోవదన్తి
సానోమంద్రేషు మూర్జం దుహానా ధేనుర్వాగస్మానుపసుష్టుత్రైతు
ఓం గణానాంత్వా గణపతి గ్ం హవామహే కవిం కవీనా ముపశ్రవ వస్తవం. జ్యేష్ట రాజం బ్రహ్మణాం బ్రాహ్మణస్పద ఆనహ్ శృణ్వన్నూతిభి: సీద సాదనం
గురుర్బ్రహ్మ గురుర్విష్ణుగురుర్దేవో మహేశ్వరః గురుసాక్షాత్ పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః....

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో వంశఋశీభ్యో నమో గురుభ్యః

ఆచమ్య
ప్రాణానాయమ్య
దేశకాలౌ సంకీర్త్య
కలశ స్థాపనం కుర్యాత్

గణపతిమారాధయేత్

పీఠ స్థాపనం కుర్యాత్ (పీఠస్థానం సంప్రోక్ష్య, శ్రీమండలం విలిఖ్య, తత్ర వస్త్రం ప్రసార్య, తస్మిన్తండులాన్ప్రసార్య, తస్మిన్ శ్రీమండలం విలిఖ్య, భూపురేణ వేష్టయేత్)

అథ పీఠ పూజ
ఉత్తరేః ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో వంశఋషిభ్యో నమో గురుభ్యః
అవాక్ - శ్రీ మహాగణాధిపతయే నమః
అధః - అతలాది సప్తలోకేభ్యోనమః
మధ్యే - మండూకాది పర్వతత్వాంత పీఠదేవతాభ్యోనమః
ప్రాగాది విదిక్షు (ఇచ్ఛాశక్తి, జ్ఞాన శక్తి....) మధ్యే... సంపూజ్య
అథ గురుమండల స్థాపనం కుర్యాత్

## గురుమండలం - వ్యాసపూజ

East
51
50 43 44
53 54 55 56 57 58
26 27 28 29 30 31 32 33 34 35 36 37 38 39 40 41 42
7
10 6 8
9
22 2 12
North 49 25 21 23 5 X 3 15 11 13 45 South
1
24 4 14
17
20 16 18
19
48 47 46
52
West

X) కలశమ్ (సశక్తీ పుత్ర పరివార సమేత త్రిమూర్తిమావాహయామి, వరుణమావాహయామి, గురు మండలం ఆవాహహామి.)

**అ) మధ్యే - శ్రీ కృష్ణ పంచకమ్**

01) మధ్యే - శ్రీ కృష్ణాయ నమః - శ్రీ కృష్ణమావాహయామి, స్థాపయామి, పూజయామి. (ధ్యాన శ్లోకం)
02) శ్రీ కృష్ణస్య పురతః - శ్రీ అనిరుద్ధాయ నమః - శ్రీ అనిరుద్ధమావాహయామి, స్థాపయామి, పూజయామి.
03) శ్రీ కృష్ణస్య దక్షిణే - శ్రీ ప్రద్యుమ్నాయ నమః - శ్రీ ప్రద్యుమ్నమావాహయామి, స్థాపయామి, పూజయామి.
04) శ్రీ కృష్ణస్య పశ్చాత్ - శ్రీ సంకర్షణాయ నమః - శ్రీ సంకర్షణమావాహయామి, స్థాపయామి, పూజయామి.
05) శ్రీ కృష్ణస్య ఉత్తరే - శ్రీ వాసుదేవాయ నమః - శ్రీ వాసుదేవమావాహయామి, స్థాపయామి, పూజయామి.

**ఆ) శ్రీ కృష్ణపంచకస్య పురతః - శ్రీ వ్యాస పంచకమ్**

06) మధ్యే - శ్రీ వేదవ్యాసాయ నమః - శ్రీ వేదవ్యాసమావాహయామి, స్థాపయామి, పూజయామి. (ధ్యాన శ్లోకం)
07) శ్రీ వేదవ్యాసస్య పురతః - శ్రీ పైలాయ నమః - శ్రీ పైలమావాహయామి, స్థాపయామి, పూజయామి.
08) శ్రీ వేదవ్యాసస్య దక్షిణే - శ్రీ వైశంపాయ నమః - శ్రీ వైశంపాయమావాహయామి, స్థాపయామి, పూజయామి.
09) శ్రీ వేదవ్యాసస్య పశ్చాత్ - శ్రీ జైమినియే నమః - శ్రీ జైమినిమావాహయామి, స్థాపయామి, పూజయామి.
10) శ్రీ వేదవ్యాసస్య ఉత్తరే - శ్రీ సుమన్తాయ నమః - శ్రీ సుమన్తమావాహయామి, స్థాపయామి, పూజయామి.

**ఇ) శ్రీ కృష్ణపంచకస్య దక్షిణే - శ్రీ సనత్కుమార పంచకమ్**

11) మధ్యే - శ్రీ సనత్కుమారాయనమః, శ్రీ సనత్కుమారామావాహయామి, స్థాపయామి, పూజయామి. (ధ్యాన శ్లోకం)
12) శ్రీ సనత్కుమారస్య పురతః - శ్రీ సనకాయనమః, శ్రీ సనకమావాహయామి, స్థాపయామి, పూజయామి.
13) శ్రీ సనత్కుమారస్య దక్షిణే - శ్రీ సనందనాయనమః, శ్రీ సనందనమావాహయామి, స్థాపయామి, పూజయామి.
14) శ్రీ సనత్కుమారస్య పశ్చాత్ - శ్రీ సనాతనాయనమః, శ్రీ సనాతనమావాహయామి, స్థాపయామి, పూజయామి.

15) శ్రీ సనత్కుమారస్య ఉత్తరే - శ్రీ సనత్సుజాతాయనమః, శ్రీ సనత్సుజాతమావాహయామి, స్థాపయామి, పూజయామి.

**ఈ) శ్రీ కృష్ణపంచకస్య పశ్చాత్ - శ్రీ ఆది శంకర పంచకమ్**

16) మధ్యే - శ్రీ జగద్గురు ఆదిశంకరాచార్య వర్యాయనమః, శ్రీ ఆదిశంకరమావాహయామి, స్థాపయామి, పూజయామి. (ధ్యాన శ్లోకం)
17) శ్రీ ఆదిశంకర పురతః - శ్రీ సురేశ్వరాచార్యాయనమః, శ్రీ సురేశ్వరాచార్యమావాహయామి, స్థాపయామి, పూజయామి.
18) శ్రీ ఆదిశంకర దక్షిణే - శ్రీ పద్మపాదాచార్యాయనమః, శ్రీ పద్మపాదాచార్యమావాహయామి, స్థాపయామి, పూజయామి.
19) శ్రీ ఆదిశంకర పశ్చాత్ - శ్రీ హస్తామలకాచార్యాయనమః, శ్రీ హస్తామలకా చార్యమావాహయామి, స్థాపయామి, పూజయామి.
20) శ్రీ ఆదిశంకర ఉత్తరే - శ్రీ తోటకాచార్యాయనమః, శ్రీ తోటకాచార్యమావాహయామి, స్థాపయామి, పూజయామి.

**ఉ) శ్రీ కృష్ణపంచకస్య ఉత్తరే - స్వగురు పంచకమ్**

21) మధ్యే - శ్రీ ......... స్వగురవే నమః, (ఉదా:- స్వగురుం శ్రీ జగద్గురు చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామి మావాహయామి) .... స్వగురుదేవతామావాహయామి, స్థాపయామి, పూజయామి. (ధ్యాన శ్లోకం, ఉంటే)
22) శ్రీ స్వగురు పురతః - శ్రీ ....... పరమగురవేనమః, శ్రీ .... పరమగురుమావాహయామి, స్థాపయామి, పూజయామి.
23) శ్రీ స్వగురు దక్షిణే - శ్రీ ....... పరమేష్ఠిగురవేనమః, శ్రీ .... పరమేష్ఠిగురుమావాహయామి, స్థాపయామి, పూజయామి.
24) శ్రీ స్వగురు పశ్చాత్ - శ్రీ ....... పరాపరగురవేనమః, శ్రీ .... పరాపరగురుమావాహయామి, స్థాపయామి, పూజయామి.
25) శ్రీ స్వగురు ఉత్తరే - శ్రీ బ్రహ్మణేనమః, శ్రీ బ్రహ్మణమావాహయామి, స్థాపయామి, పూజయామి.

("......" ఉన్న చోట గురువుల పేర్లు చెప్పుకోనవచ్చు/ ధ్యానించవచ్చు. జగద్గురువులైతే ముందు శ్రీ జగద్గురువు అనే విశేషణం చేర్చాలి, చివర్న స్వామి చేర్చాలి. ఉదా:- శ్రీ జగద్గురు ఆదిశంకరాచార్య స్వామి స్వగురవే నమః)

**ఋ) సర్వేషాం పంచకానాం పురతః - గురుపరంపర**

26) శ్రీ దక్షిణామూర్తయేనమః - శ్రీ దక్షిణామూర్తిమావాహయామి, స్థాపయామి, పూజయామి.
27) శ్రీ బ్రహ్మణేనమః - శ్రీ బ్రహ్మణమావాహయామి, స్థాపయామి, పూజయామి.
28) శ్రీ వశిష్ఠాయనమః - శ్రీ వశిష్ఠమావాహయామి, స్థాపయామి, పూజయామి.

29) శ్రీ శక్తయేనమః - శ్రీ శక్తిమావాహయామి, స్థాపయామి, పూజయామి.
30) శ్రీ పరాశరాయనమః - శ్రీ పరాశరమావాహయామి, స్థాపయామి, పూజయామి.
31) శ్రీ శుకాయనమః - శ్రీ శుకమావాహయామి, స్థాపయామి, పూజయామి.
32) శ్రీ గౌడపాదాయనమః - శ్రీ గౌడపాదమావాహయామి, స్థాపయామి, పూజయామి.
33) శ్రీ గోవిందభగవత్పాదాయనమః - శ్రీ గోవిందభగవత్పాదమావాహయామి, స్థాపయామి, పూజయామి.
34) శ్రీ విద్యారణ్యాయనమః - శ్రీ విద్యారణ్యమావాహయామి, స్థాపయామి, పూజయామి.
35) శ్రీ వామదేవాయనమః - శ్రీ వామదేవమావాహయామి, స్థాపయామి, పూజయామి.
36) శ్రీ దత్తాత్రేయాయనమః - శ్రీ దత్తాత్రేయమావాహయామి, స్థాపయామి, పూజయామి.
37) శ్రీ నిరాఘాయ నమః - శ్రీ నిరాఘమావాహయామి, స్థాపయామి, పూజయామి.
38) శ్రీ ఋభవే నమః - శ్రీ ఋభుమావాహయామి, స్థాపయామి, పూజయామి.
39) శ్రీ జడభరతాయ నమః - శ్రీ జడభరతమావాహయామి, స్థాపయామి, పూజయామి.
40) శ్రీ దూర్వాసాయ నమః - శ్రీ దూర్వాసోమావాయయామి, స్థాపయామి, పూజయామి.
41) శ్రీ వరుణాయ నమః - శ్రీ వరుణమావాహయామి, స్థాపయామి, పూజయామి.
42) శ్రీ భృగవే నమః - శ్రీ భృగుమావాహయామి, స్థాపయామి, పూజయామి.

## ఋ) పీఠస్య ప్రాగాది దశ దిక్షు విదిక్షు ఇంద్రాది దిక్పాలకాః

43) ఇంద్రాయ నమః - ఇంద్రమావాహయామి, స్థాపయామి, పూజయామి.
44) అగ్నయే నమః - అగ్నిమావాహయామి, స్థాపయామి, పూజయామి.
45) యమాయ నమః - యమమావాహయామి, స్థాపయామి, పూజయామి.
46) నిరృతయే నమః - నిరృతమావాహయామి, స్థాపయామి, పూజయామి.
47) వరుణాయ నమః - వరుణమావాహయామి, స్థాపయామి, పూజయామి.
48) వాయవే నమః - వాయుమావాహయామి, స్థాపయామి, పూజయామి.
49) కుబేరాయ నమః - కుబేరమావాహయామి, స్థాపయామి, పూజయామి.
50) ఈశానాయ నమః - ఈశానమావాహయామి, స్థాపయామి, పూజయామి.
51) ఊర్ధ్వపురుషాయ నమః - ఊర్ధ్వపురుషమావాహయామి, స్థాపయామి, పూజయామి.
52) పృథ్వ్యై నమః - పృథివీమావాహయామి, స్థాపయామి, పూజయామి.

## ఏ) పంచలోకపాలక, క్షేత్రపాలక పూజ

53) గణపతయే నమః - సాంగంసాయుధం సపత్నీ పుత్ర పరివార సమేతం గణపతిం లోకపాలకమావాహయామి స్థాపయామి పూజయామి
54) బ్రహ్మణే నమః - సాంగంసాయుధం సపత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మణం లోకపాలకమావాహయామి స్థాపయామి పూజయామి
55) విష్ణవే నమః - సాంగంసాయుధం సపత్నీ పుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలకమావాహయామి స్థాపయామి పూజయామి
56) రుద్రాయ నమః - సాంగంసాయుధం సపత్నీ పుత్ర పరివార సమేతం రుద్రం లోకపాలకమావాహయామి స్థాపయామి పూజయామి
57) దుర్గాయై/గౌర్యై నమః - సాంగంసాయుధం సపరివార సమేతం దుర్గాం/ గౌరీం లోకపాలకమావాహయామి స్థాపయామి పూజయామి
58) క్షేత్రపాలకాయ నమః - సాంగంసాయుధం సపతీ పుత్ర పరివార సమేతం క్షేత్రపాలకమావాహయామి స్థాపయామి పూజయామి

ప్రాణ ప్రతిష్ఠాపనమ్, కించిన్నివేదనమ్

అథ ధ్యానమ్
బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షి భూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుమ్ తమ్ నమామి!

పురుషసూక్తేన షోడశోపచారం కృత్వా

సహస్రశీర్షేత్యావాహనమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః ఆవాహనార్థే పుష్పాక్షతాన్ సమర్పయామి
పురుషయేవేదమిత్యాసనమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః నవరత్న ఖచిత హేమ సింహాసనార్థం పుష్పాక్షతాన్ సమర్పయామి
ఏతావానస్యేతి పాద్యమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః పాదయోః పాద్యం సమర్పయామి
త్రిపాదూర్ధ్వ ఇత్యర్ఘ్యమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి
తస్మాద్విరాడిత్యాచమనమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః ముఖే ఆచమనీయం సమర్పయామి (మూడు మార్లు)
శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః మధుపర్కం సమర్పయామి
యత్పురుషేణేతి స్నానమ్ - ఆపోహిష్ఠేతి స్నానమ్, పంచామృతస్నానం ఫలోదక స్నానం శుద్ధోదక స్నానం - శ్రీ కృష్ణాద్యావాహిత

గురుదేవతాభ్యోనమః స్నానం సమర్పయామి, స్నానాంతే ఆచమనీయం సమర్పయామి (మూడు మార్లు).
సప్తాస్యాసన్నితి వస్త్రమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః వస్త్రాణి సమర్పయామి. వస్త్రాంతే ఆచమనీయం సమర్పయామి (మూడు మార్లు).
తం యజ్ఞమితి యజ్ఞోపవీతమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః యజ్ఞోపవీత, దాండాదీన్ సమర్పయామి.ఆచమనీయం సమర్పయామి (మూడు మార్లు).
తస్మాద్యజ్ఞాదితి ఆభరణమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః నానావిధ ఆభరణాని సమర్పయామి.
తస్మాద్యజ్ఞాత్సర్వహుతమితి గంధమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః చందన / వీభూదిం సమర్పయామి.
- శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః అక్షతాన్ సమర్పయామి.
- శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః సుగంధద్రవ్యాన్ సమర్పయామి.
తస్మాదశ్వాఇతి పుష్పమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి. (పైన ఆవాహన చేసిన అన్ని నామాలు, కేశవాది 24 నామాలు, వ్యాసాష్టోత్తరం లేదా గుర్వష్టోత్తరం తో పుష్పసమర్పణం చేయవచ్చు)
యత్పురుషమితి ధూపమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః ధూపమాఘ్రాపయామి.
బ్రాహ్మణోస్యేతి దీపమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః దీపం దర్శయామి, ధూప దీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.
చంద్రమామనసేతి నైవేద్యమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః ( క్షీర, మధు, గుడ, ఫల, ఖర్జూరద్రాక్షాదిశుష్కఫలాన్నివేదయామి) నైవేద్యం సమర్పయామి శుద్ధాచమనీయం సమర్పయామి. (నైవేద్య మంత్రం చెప్పి నివేదన చేయవలెను)
నాభ్యాఆసీదితి తాంబూల , ఫల దక్షిణాదీన్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః తాంబూల , ఫల దక్షిణాదీన్ సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి
వేదాహమేతమితి నీరాజనమ్ - శ్రీ కృష్ణాద్యావాహిత గురుదేవతాభ్యోనమః నీరాజనం దర్శయామి.
మంత్ర పుష్పం
ప్రదక్షిణ
నమస్కారాన్
పునఃపూజ

## అపరాధ క్షమాయాచన
## పూజా సమర్పణమ్
## ఉద్వాసనమ్

## శాంతి మంత్రం



## శ్రీ వేద వ్యాసాష్టోత్తరం

ధ్యానమ్ : కృష్ణ ద్వైపాయనం వ్యాసం సర్వలోక హితేరతం
వేదాబ్జభాస్కరం వందే శమాది నిలయం మునిం

001. ఓం వ్యాసాయ నమః
002. ఓం ద్వైపాయనాయ నమః
003. ఓం శ్రేష్ఠాయ నమః
004. ఓం సత్యాత్మనే నమః
005. ఓం బాదరాయణాయ నమః
006. ఓం మునయే నమః
007. ఓం సత్యవతీ పుత్రాయ నమః
008. ఓం శుక తాతాయ నమః
009. ఓం తపోనిధయే నమః
010. ఓం వశిష్ఠనప్త్రే నమః
011. ఓం సర్వజ్ఞాయ నమః
012. ఓం విష్ణు రూపాయ నమః
013. ఓం దయానిధయే నమః
014. ఓం పరాశరాత్మజాయ నమః
015. ఓం శాంతాయ నమః
016. ఓం శక్తిపౌత్రాయ నమః
017. ఓం గుణాంబుధయే నమః
018. ఓం కృష్ణాయ నమః
019. ఓం వేదవిభక్త్రే నమః
020. ఓం బ్రహ్మసూత్రకృతే నమః
021. ఓం అవ్యయాయ నమః
022. ఓం మహాయోగీశ్వరాయ నమః
023. ఓం సౌమ్యాయ నమః
024. ఓం ధన్యాయ నమః
025. ఓం పింగజటాధరాయ నమః
026. ఓం చీరాజినధరాయ నమః
027. ఓం శ్రీమతే నమః
028. ఓం అష్టాదశపురాణకృతే నమః
029. ఓం దండినే నమః
030. ఓం కమండలధరాయ నమః
031. ఓం కురువంశప్రవర్ధకాయ నమః
032. ఓం నిర్మమాయ నమః
033. ఓం నిరహంకారాయ నమః
034. ఓం నిష్కళంకాయ నమః
035. ఓం నిరంజనాయ నమః
036. ఓం జితేంద్రియాయ నమః
037. ఓం జితక్రోధాయ నమః
038. ఓం స్మృతికర్త్రే నమః
039. ఓం మహాకవయే నమః
040. ఓం తత్త్వ జ్ఞానినే నమః
041. ఓం తత్త్వబోధకర్త్రే నమః
042. ఓం కాశీనివాసభువే నమః
043. ఓం మహాభారత కర్త్రే నమః
044. ఓం చిరంజీవినే నమః
045. ఓం మహామతయే నమః
046. ఓం సజ్జనానుగ్రహపరాయ నమః
047. ఓం సత్యవాదినే నమః
048. ఓం దృఢవ్రతాయ నమః
049. ఓం బదర్యాశ్రమసంచారిణే నమః
050. ఓం కోటిసూర్యసమప్రభాయ నమః
051. ఓం త్రిపుండ్రవిలసత్ఫాలాయ నమః
052. ఓం అష్టావింశతి రూపభృతే నమః
053. ఓం రవీందుమిత్రశిష్యాఢ్యాయ నమః
054. ఓం సుశీలాయ నమః
055. ఓం యతిపూజితాయ నమః
056. ఓం వైయ్యాఘ్రచర్మవసనాయ నమః
057. ఓం చిన్ముద్రావిలసత్కరాయ నమః
058. ఓం రుద్రాక్షమాలాభూషాఢ్యాయ నమః
059. ఓం కలిపాపనివారకాయ నమః
060. ఓం ధర్మాశ్వమేధసందేష్ట్రే నమః
061. ఓం సంజయజ్ఞానదృష్టిదాయ నమః
062. ఓం ధృతరాష్ట్రపుత్రదర్శినే నమః
063. ఓం విదురాదిప్రపూజితాయ నమః
064. ఓం పుత్రమోహవ్యాకులాత్మనే నమః
065. ఓం జనకజ్ఞానదాయకాయ నమః
066. ఓం కర్మఠాయ నమః
067. ఓం దీర్ఘ దేహాఢ్యాయ నమః
068. ఓం దర్భాసీనాయ నమః
069. ఓం వరప్రదాయ నమః
070. ఓం యమునాద్వీపజననాయ నమః
071. ఓం మోక్షోపాయప్రదర్శకాయ నమః
072. ఓం ఋషిపూజ్యాయ నమః
073. ఓం బ్రహ్మనిధయే నమః
074. ఓం శిఖావతే నమః
075. ఓం జటిలాయ నమః
076. ఓం పరాయ నమః
077. ఓం అష్టాంగయోగనిరతాయ నమః
078. ఓం గాంధారీగర్భసంరక్షకాయ నమః
079. ఓం పాండవప్రీతిసంయుతాయ నమః
080. ఓం వసుభూపాలదౌహిత్రాయ నమః
081. ఓం వ్యాసకాశీసదావాసాయ నమః
082. ఓం నరనారాయణార్చకాయ నమః
083. ఓం విత్యోపవాససంతుష్టాయ నమః
084. ఓం సరహింసాపసరాఙ్ముఖాయ నమః
085. ఓం శివపూజైకనిరతాయ నమః
086. ఓం సురాసురసుపూజితాయ నమః
087. ఓం సర్వక్షేత్రనివాసినే నమః
088. ఓం సర్వతీర్థావగాహనాయ నమః
089. ఓం యుధిష్ఠిరాభిషేక్త్రేనమః
090. ఓం స్మృతిమాత్రాప్తసన్నిధయే నమః
091. ఓం త్రికాలజ్ఞాయ నమః
092. ఓం విశుద్ధాత్మనే నమః
093. ఓం నిర్వికారాయ నమః
094. ఓం నిరామయాయ నమః
095. ఓం ఊర్ధ్వరేతసే నమః
096. ఓం మాతృభక్తాయ నమః
097. ఓం నిశ్చింతాయ నమః
098. ఓం నిర్మలాశయాయ నమః
099. ఓం రూపాంతరచరాయ నమః
100. ఓం పూజ్యాయ నమః
101. ఓం సదా శిష్యసమావృతాయ నమః
102. ఓం ఖిక్షేశ్వర ప్రతిష్ఠాత్రే నమః
103. ఓం నిరవద్యాయ నమః
104. ఓం నిరంకుశాయ నమః
105. ఓం సర్వభూతహృదావాసాయ నమః
106. ఓం సర్వేష్టార్థప్రదాయకాయ నమః
107. ఓం సర్వలోకగురవే నమః
108 . ఓం సచ్చిదానందజ్ఞాననిధయే నమః

